శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానంవిశిష్యతే।
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతిరనంతరమ్. 12

అభ్యాసాత్-అభ్యాసయోగమునకంటె; జ్ఞానం-జ్ఞానము; శ్రేయోహి-శ్రేష్ఠమైనదిగదా; జ్ఞానాత్ - జ్ఞానమునకంటె; ధ్యానం-ధ్యానము; విశిష్యతే-శ్రేష్ఠమవుచున్నది; ధ్యానాత్-ధ్యానముకంటె, కర్మఫలత్యాగః - కర్మఫలపరిత్యాగము ను, త్యాగాత్-త్యాగమునకంటె, అనంతరం-ఆపిమ్మట; శాంతిః-శమము (శ్రేష్టమగునది), స్యాత్-అవును.

అభ్యాసయోగమునకన్న జ్ఞానము శ్రేష్టము. జ్ఞానముకన్న ధ్యానము శ్రేష్టము. ధ్యానముకన్న కర్మఫలత్యాగము శ్రేష్టము. ఆలాటి కర్మఫలత్యాగమువల్ల మోక్షము ప్రాప్తమగుచున్నది.

అద్వేష్టాసర్వభూతానాం మైత్రఃకరుణఏవచ।
నిర్మమోనిరహంకార స్సమదుఃఖసుఖఃక్షమీ. 13
సంతుష్టస్సతతంయోగీ యతాత్మాదృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్సమే ప్రియః. 14

సర్వభూతానాం-సమస్తప్రాణులకు; అద్వేష్టా-ద్వేషిగానివాఁడును; మైత్రః-మిత్రుఁడును; కరుణః-దయగలవాఁడును; నిర్మమః-మమకారరహితుండును, నిరహంకారః- అహంకారర

హితుఁడును; సమదుఃఖసుఖః- సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడును; క్షమీ - ఓర్పుగలవాఁడును. సతతం- ఎల్లప్పుడును; సంతుష్టః- సంతోషమును బొందినవాఁడును; యోగీ- ధ్యానపరుఁడును; యతాత్మా- నియమింపఁబడిన మనోవృత్తిగలవాఁడును; దృఢనిశ్చయః - సంశయ రహితుండును; మయి-నాయందు; అర్పితమనోబుద్ధిః- ఉంచఁబడిన మనస్సును బుద్ధియు గలవాఁడును; మద్భక్తః - నాకు భక్తుఁడును; ఇట్టిగుణములతోఁ గూడినవాఁడు; యః-ఎవ్వఁడో; సః- వాఁడు; మే- నాకు; ప్రియః-ఇష్టుఁడు.

ఎల్లభూతములయందును వైరములేనివాఁడు ఎల్లప్రాణులకు మిత్రుఁడు దయగలవాఁడు మమకార అహంకారములులేనివాఁడు సుఖదుఃఖములను సమానముగా జూచువాఁడు ఓర్పుగలవాఁడు నిత్యసంతోషి ధ్యానపరుడు అచంచల మనోవృత్తిగలవాఁడు సందేహము లేనివాఁడు నాయందు మనోబుద్ధులను వుంచిన నాభక్తుఁడు ఎవడో వాఁడు నాకుస్నేహితుడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచయః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తోయస్సచమేప్రియః. 15

యస్మాత్ -ఎవనివలన; లోకః-జనము; నోద్విజతే-భయపడదో; యః-ఎవ్వఁడు; లోకాత్ - జనమువలన; నోద్విజతే-

భయపడఁడో; యః-ఎవ్వఁడు; హర్షామర్షభయోద్వేగైః, హర్ష-ప్రీతిచేతను; అమర్ష-అసహిష్ణుత్వముచేతను; భయ-భయముచేతను; ఉద్వేగైః-ఉద్విగ్నత్వముచేతను; ముక్తః-విడువఁబడినవాఁడో; సచ-వాఁడును; మే-నాకు; ప్రియః-ఇష్టుఁడు.

ఎవనివలన ఎల్లజనులకును ఎల్లజనులవలన ఎవనికిని భయము లేకపోయి సంతోషమునకును భయమునకును అసూయకును అతీతుఁడై యుండునో అట్టివాఁడు నాకు మిగుల యిష్టమైన వాఁడు.

అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. 16

అనపేక్షః-అపేక్షారహితుఁడును; శుచిః-పవిత్రుఁడును; దక్షః-సమర్థుఁడును; ఉదాసీనః-పక్షపాతరహితుఁడును; గతవ్యథః-నిర్భయుఁడును; సర్వారంభపరిత్యాగీ-సర్వసంకల్పరహితుఁడును; మద్భక్త-నాకు భక్తుఁడును. యః-యెవ్వఁడో; సః-వాఁడు; మే-నాకు; ప్రియః-ఇష్టుఁడు.

ఎవఁడైతే యిచ్ఛలేక పవిత్రుఁడై శక్తిగలిగి పక్షపాతము లేక భయములేనివాఁడై కర్మఫలములు గోరక నాకుభక్తుఁడుగానుండునో అట్టివాఁడు నాకు మిక్కిలి యిష్టుఁడు.

యోనహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి।

శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్సమేప్రియః. 17

యః-ఎవ్వడు; నహృష్యతి-సంతోషించడో; నద్వేష్టి-ద్వేషించడో; నశోచతి-దుఃఖించడో; నకాంక్షతి-అపేక్షించడో; శుభాశుభపరిత్యాగీ - శుభాశుభములనుబరిత్యజించినవాడును; భక్తిమాన్ - భక్తిగలిగినవాడును; యః-ఎవ్వడో; సః-వాడు; మే-నాకు; ప్రియః-ఇష్టుడు.

ఎవడైతే సంతోషమునకును ద్వేషమునకును దుఃఖమునకును ఆశకును శుభాశుభములకును అతీతుడై నాయందుభక్తిచేయుచున్నాడో అట్టివాడు నాకు మిగుల ప్రియుడు.

సమశ్శత్రౌచ మిత్రేచ తథామానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః. 18
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టోయేనకేనచిత్।
అనికేతః స్థిరమతి భక్తిమాన్ మే ప్రియోనరః. 19

శత్రౌచ-శత్రువునందును; మిత్రేచ - స్నేహితునియందును; తథా-అలాగుననే; మానావమానయోః - మానావమానములయందును; సమః-సమానుడైనవాడును; శీతోష్ణ సుఖదుఃఖేషు-శీతోష్ణసుఖదుఃఖములయందును; సమ - సముడైనవాడును; సంగవివర్జితః- సంగరహితుడును. తుల్యనిందాస్తుతిః-నిందాస్తుతులయందుసమానుడును; మౌనీ- వాఙ్నియ

షము గలవారును; యేనకేనచిత్- యెంతమాత్రముచేతనైనను; సంతుష్టః- తృప్తిబొందువాడును; అనికేతః- నివాసరహితుడును; స్థిరమతిః- నిశ్చయబుద్ధిగలవాడును; భక్తిమాన్- నాయందు భక్తిగలవాడును; యోనరః- ఏపురుషుడో; సః-వాడు; మే-నాకు; ప్రియః-ఇష్టుడు.

ఎవడైతే పగవారియందును స్నేహితులయందును మానావమానములయందును శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును సమానుడై సంగరహితుడై మౌనమును జెందినవాడై లాభమయినంతవరకు సంతుష్టుడై నివాసరహితుడై చలించనిబుద్ధిగలవాడై నాయందు భక్తిచేయుచున్నాడో వాడు నాకు మిగుల ప్రియుడు.

యేతుధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానామత్పరమా భక్తాస్తేతీవమేప్రియాః. 20

యేతు- ఎవరయి , మత్పరమాస్సంతః- నేనే పరమగతిగలవారలయి; ఇదం-ఈ; ధర్మ్యామృతం, ధర్మ్య-మోక్షప్రదమైన; అమృతం-అమృతమును; శ్రద్ధధానాః- విశ్వసించినవారలయి; యథోక్తం- నాచేజెప్పబడిన క్రమమునతిక్రమించక; పర్యుపాసతే- సేవింపుచున్నారో; తేభక్తాః-ఆభక్తులు; మే-నాకు; అతీవ-మిక్కిలి; ప్రియాః-స్నేహితులు.

ఎవరైతే నేనే పరమగతియని నమ్మి మోక్షప్రదమైన ఈ అమృతవాక్యములను నమ్మి నేనుజెప్పినవిధమున శ్రద్ధతో నడచుకొనుచున్నారో అట్టి నాభక్తులు అందరికన్న నాకు మిగుల ప్రియులు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తి
యోగో నామ ద్వాదశోధ్యాయః.

ఉపనిషద్ రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీకృష్ణార్జునుల సంవాదరూపంబైన
శ్రీ భగవద్గీతలయందు భక్తి యోగమనెడి
ద్వాదశోధ్యాయము ముగిసినది.

→✻○←

శ్రీ భగవద్గీత.

క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగోనామ
త్రయోదశోధ్యాయః.

అర్జున ఉవాచ.

ప్రకృతింపురుషంచైవ క్షేత్రంక్షేత్రజ్ఞమేవచ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానంజ్ఞేయంచకేశవ. 1

హే కేశవ- ఓ శ్రీ కృష్ణస్వామీ; ప్రకృతిం-ప్రకృతిని; పురుషం-పురుషుని; క్షేత్రం-క్షేత్రమును; క్షేత్రజ్ఞంచ- క్షేత్రజ్ఞుని; జ్ఞానం- జ్ఞానమును; జ్ఞేయంచ- జ్ఞేయమును; ఏతత్ - ఈ సమస్తమును; వేదితుం- తెలియుటకొఱకు; ఇచ్ఛామి- కోరుచున్నాను.

ఓ మాధవ, ప్రకృతియనగా నేది, పురుషుడనగా నెవ్వఁడు, క్షేత్రమనగా ఎట్టిది, క్షేత్రజ్ఞుడనగా ఎవ్వడు, జ్ఞానమనగా ఏమి, జ్ఞేయమనగా ఏమి, ఇవిఎల్ల చక్కఁగా తెలియ నిచ్ఛయించియున్నాను.

శ్రీ భగవాన్ ఉవాచ.

ఇదంశరీరంకౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యోవేత్తితంప్రాహుః క్షేత్రజ్ఞఃఇతితద్విదః. 2

హే కౌంతేయ-ఓ అర్జునుడా; ఇదంశరీరం- ఈ దేహము; క్షేత్రమితి-క్షేత్రమని; అభిధీయతే- చెప్పబడుచున్నది; యః- ఎవ్వడు; ఏతత్ -ఈశరీరమును; వేత్తి-తెలియుచున్నాడో; తద్విదః- తత్ క్షేత్రవేత్తలు; తం- ఆ తెలిసినవానిని; క్షేత్రజ్ఞ ఇతి- క్షేత్రజ్ఞుడని; ప్రాహుః-చెప్పుదురు.

ఓ అర్జునా, దేహము క్షేత్రమనియు, దేహమును తెలిసికొన్నవాడు క్షేత్రజ్ఞుడనియు, పెద్దలు చెప్పెదరు.

క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానంమతంమమ. 3

హే భారత- ఓ అర్జున; సర్వక్షేత్రేషు- సమస్త క్షేత్రములయందు; క్షేత్రజ్ఞంచాపి-క్షేత్రవేత్తగాను; మాం-నన్ను; విద్ధి- తెలియుము; క్షేత్ర క్షేత్రజ్ఞయోః- క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క; జ్ఞానం- తెలియుట; యత్ -ఏదో, తత్ -అది. జ్ఞానం-జ్ఞానమని; మమ-నాకు: మతం-సమ్మతము.

ఓ అర్జున, ఎల్లక్షేత్రములయందుండు క్షేత్రజ్ఞుడు నేనే యని తెలిసికొమ్ము. ఈ క్షేత్రమునున్ను తదంతర్గతమైయున్న క్షేత్రజ్ఞున్ని విభజించి తెలియుట ఏదియో అదియే జ్ఞానమని చెప్పబడుచున్నది.

తత్ క్షేత్రంయచ్చ యాదృక్చ యద్వికారియతశ్చయత్।
సచయోయత్ప్రభావశ్చ తత్సమాసేనమేశృణు. 4

హే భారత-ఓ అర్జున; తత్ క్షేత్రం-ఆక్షేత్రము; యచ్చ-ఏదో; యాదృక్చ-ఎట్టిదో; యద్వికారి- ఏయేవికారములు గలదో; యతశ్చ-ఏకారణమువలన; యత్ - ఏ కార్యము పుట్టునో; సచ-ఆ క్షేత్రజ్ఞుడు; యః-ఎవ్వడో; యత్ప్రభావశ్చ-ఎట్టిప్రభావము గలదో; తత్ -అస్వరూపమును; సమాసేన - సంక్షేపముచేత; మే-నాయొక్క వచనమువలన: శృణు-వినుము.

ఆ క్షేత్రమేదియో, దాని స్వభావమెట్టిదో, దాని వికార ములేవియో, ఏ కారణమువల్ల అది ఉత్పత్తైనదో, వాటిన్ని క్షేత్రజ్ఞునిన్ని, దాని స్వభావమున్ను సంక్షేపముగా జెప్పెదను వినుము.

ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః 5

తత్ - తత్స్వరూపము; ఋషిభిః—వసిష్ఠాది ఋషులచేత; బహుధా - బహుప్రకారములుగా; గీతం- చెప్పబడెను; వివిధైః— నానావిధములయిన, ఛందోభిః—వేదములచేతనున్ను; పృథక్ - ప్రత్యేకముగా; గీతం - చెప్పబడెను; హేతుమద్భిః - యుక్తియుక్తములైన; వినిశ్చితైః—నిస్సంశయముగా నిర్ణయింపబడి బ్రహ్మసూత్రపదైశ్చైవ-బ్రహ్మసూత్ర వాక్యములచేతను న్ను, గీతం—చెప్పబడెను.

ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపనిర్ణయములు మహర్షులవల్లను వేదములవల్లను పలువిధములుగా జెప్పబడి యున్నవి. ఇంతియే కాక, సంశయమునకు ఆస్పదములేని బ్రహ్మ సూత్రము వల్లనున్ను ఎఱింగింపబడియున్నవి.

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ।
ఇంద్రియాణిదశైకంచ పంచచేంద్రియగోచరాః 6

మహాభూతాని-పృథివ్యాది భూతములున్ను; అహంకారః-అహంకారమున్ను; బుద్ధిః-బుద్ధిన్ని; అవ్యక్తమేవచ- మాయయున్ను; దశైకంచ-జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదిన్ని (మనస్సున్ను చేరి పదునొకండయిన); ఇంద్రియాణి- ఇంద్రియములున్ను; పంచ-ఐదయిన; ఇంద్రియగోచరాః - శబ్దాదివిషయములున్ను; (ఇవి చతుర్వింశతి తత్త్వములు).

పంచభూతములయిన పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమున్ను, అహంకారము, బుద్ధి, మాయయున్ను; జ్ఞానేంద్రియములయిన శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణములున్ను, కర్మేంద్రియములయిన వాక్కు, పాద, పాణి, పాయు, ఉపస్థతులున్ను, మనస్సున్ను, ఇంద్రియగోచరంబులగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములయిన పంచతన్మాత్రలున్ను అంతుచేరి యిరువదినాలుగు తత్వములాయెను.

ఇచ్ఛా ద్వేషస్సుఖందుఃఖం సంఘాతశ్చేతనాధృతిః।
ఏతత్క్షేత్రంసమాసేన సవికారముదాహృతమ్. 7

ఇచ్ఛా-కోరికయున్ను; ద్వేషః-ద్వేషమున్ను; సుఖం-సుఖమున్ను; దుఃఖం - దుఃఖమున్ను; సంఘాతః - దేహేంద్రియాదిసంహతిన్ని; చేతనా-మనోవృత్తిన్ని; ధృతిః- ధైర్యములున్ను; సవికారం-తత్తద్వికారములతోగూడిన. ఏతత్-ఇది;

క్షేత్రం-క్షేత్రమని; సమాసేన-సంగ్రహముచేతను; ఉదాహృతం-చెప్పబడెను.

కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాది సమూహము, మనోవృత్తి, ధైర్యము, అనే వికారములతోఁ గూడిన ఇరువది నాలుగు తత్త్వములు క్షేత్రమని సంగ్రహముగా చెప్పఁబడినది.

అమానిత్వమదంభిత్వమహింసాక్షాంతిరార్జవమ్।
ఆచార్యోపాసనంశౌచం స్థైర్యమాత్మవినిగ్రహః. 8

అమానిత్వం-తన్ను స్తోత్రము జేసికొనకయుండుటయు; అదంభిత్వం-స్వధర్మమును ప్రకాశము జేసుకొనకయుండుటయు; అహింసా-హింసారాహిత్యంబును; క్షాంతిః-క్షమించుటయు; ఆర్జవం-కౌటిల్యరాహిత్యంబును; ఆచార్యోపాసనం-గురుసేవయు; శౌచం-బాహ్యాభ్యంతరశుచిత్వంబును; స్థైర్యం-చలనము లేకయుండుటయు; ఆత్మవినిగ్రహః-మనోనిగ్రహంబును.

తన్ను తాను పొగడుకొనకయుండుట తనధర్మము తాను ప్రకాశము చేసికొనకయుండుట హింస జేయకయుండుట క్షమ కృత్రిమము లేకపోవుట గురుసేవ బాహ్యాంతరశుద్ధి అచంచలము మనోనిగ్రహము పుట్టుట.

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్, 9

ఇంద్రియార్థేషు-విషయములయందు; వైరాగ్యం- ఆశ లేకయుండుటయు; అనహంకార ఏవచ-అహంకారము లేకయుండుటయు; జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్-జన్మమరణ జరారోగదుఃఖములయందలిదోషముల నాలోచించుటయు.

ఇంద్రియ విషయములయందు ఆశలేకయుండుట, అహంకారము లేకయుండుట, జన్మము, మరణము, ముసలితనము, రోగము, దుఃఖము వీటిలోని దోషములను యోచించి తెలుసుకొనుట.

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యంచసమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 10

పుత్రదారగృహాదిషు - పుత్రదారగృహాదులయందు; అనసక్తిః-అనసక్తిలేకయుండుటయు; అనభిష్వంగః - అనన్యాత్మభావనాలక్షణమైన; అసక్తిః - విశేషము లేకయుండుటయు; ఇష్టానిష్టోపపత్తిషు-ఇష్టానిష్టప్రాప్తులయందు; నిత్యంచ-ఎల్లప్పుడున్ను; సమచిత్తత్వం-సమబుద్ధిగలిగియుండుటయు.

విషయములయందాసక్తిలేకయుండుట పుత్ర దారాగృహా

దులను గలుగు సుఖదుఃఖములు మొదలగునవి తనవి గాభని భావించుట ఇష్టానిష్టప్రాప్తులయందు ఎల్లప్పుడు సమ చిత్తత్వము గలిగియుండుట.

మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది. 11

మయిచ-నాయందే; అనన్యయోగేన-శ్రీవాసుదేవేతర గతిలేదనెడి యోగముచేత; అవ్యభిచారిణీ - వ్యభిచారమును పొందనట్టి; భక్తిః-భక్తియు; వివిక్తదేశసేవిత్వం-విజనస్థలవాసియగుటయు; జనసంసది - జనసమూహమందు; అరతిః- అనురాగము లేకయుండుటయు.

ఇతర దేవతారాధనయందు మనస్సు చలించక నేనే గతి యనినన్ను నాయందు రూఢమయిన భక్తిచేయుట విజనస్థల వాసియగుట జనసమూహమునందు ప్రీతిలేకయుండుట,

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతత్ జ్ఞానమితిప్రోక్త మజ్ఞానంయదతోఽన్యథా. 12

అధ్యాత్మజ్ఞాననిత్యం- ఆత్మజ్ఞానమందు నిత్యభావమున్ను; తత్త్వజ్ఞానార్థదర్శనం - మోక్షజ్ఞానమందు ప్రయోజనదృష్టిన్ని; ఏతత్-ఈచెప్పబడినది; జ్ఞానమితి-జ్ఞానమని; ప్రోక్తం-చెప్పబడెను; అతః-దీనికంటే; అన్యథా-ఇతరమైనది; యత్-

ఏదిగలదో; అజ్ఞానం-అజ్ఞానమని; ప్రోక్తం-చెప్పబడెను.

ఆత్మజ్ఞానమందు నిత్యభావము గలుగుట మోక్షప్రాప్తి యందే ప్రయోజనదృష్టియుంచుట ఇవి అన్నియు జ్ఞానమని పెద్దలు జెప్పుదురు. వీటికి యితరములన్నియు అజ్ఞానములని చెప్పబడును.

జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మృతమశ్నుతే।
అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే. 13

జ్ఞేయం-తెలియదగినది; యత్-ఏదో; తత్-దానిని; ప్రవక్ష్యామి-చెప్పెదను; యత్-దేని; జ్ఞాత్వా-తెలిసి; అమృతం-మోక్షమును; అశ్నుతే-పొందగలడో; అనాదిమత్-అదిలేనిదిన్ని; పరం-ఉత్కృష్టమైనదిన్ని; తద్బ్రహ్మ-ఆబ్రహ్మము; సత్-సత్తున్ను; అసత్-అసత్తున్ను; న-కాదు; ఇతి-ఇట్లని; ఉచ్యతే-చెప్పబడుచున్నది.

ఇకను తెలిసికొనదగిన విషయము ఏదియో దానిని జెప్పుచున్నాను. దానిని తెలిసినట్టాయెనేని మోక్షప్రాప్తియగును. దానినే బ్రహ్మమని చెప్పుచున్నారు. ఆ బ్రహ్మము మొదలులేనిది మిక్కిలి శ్రేష్టమయినది, వేద సంహిత మగుటవలన సత్తైన ఘటాఘటాదులకన్న అసత్తైన శశశృంగాదులకన్న విలక్షణమయినది.

సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతఃశ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి. 14

తత్ -ఆబ్రహ్మము; సర్వతః - అంతటనున్ను; పాణిపాదం- హస్తపాదములుగలిగినదై; సర్వతః - అంతటనున్ను; అక్షిశిరోముఖం-నేత్రశిరోముఖములుగలిగినదై; సర్వతఃశ్రుతిమత్ - అంతటశ్రోత్రములు గలిగినదై; సర్వం-సమస్తమునున్ను; ఆవృత్య-వ్యాపించి; లోకే-లోకమందు; తిష్ఠతి-ఉంచున్నది,

ఆ బ్రహ్మము యెల్లదిశలయందు చేతులు, కాళ్ళు, కండ్లు, శిరస్సులు, ముఖములు, చెవులూ గలిగినదియై ఎల్ల ప్రపంచమును వ్యాపించియుండునది.

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్।
అసక్తంసర్వభృచ్చైవ నిర్గుణంగుణభోక్తృచ 15

(ఆబ్రహ్మము), సర్వేంద్రియగుణాభాసం-సకలేంద్రియవ్యాపారములచేత ప్రకాశింపుచున్న దానివలె నుండినను; సర్వేంద్రియవివర్జితం - సకలేంద్రియ రహితమైనదిన్ని; అసక్తం- ఇందులనంటనిదైనను; సర్వభృచ్చైవ - సమస్తమును ధరించినట్టిదిన్ని; నిర్గుణం-గుణములేనిదైనను; గుణభోక్తృచ - గుణములననుభవించునట్టిదిన్ని.

ఆ బ్రహ్మము యెల్ల ఇంద్రియవ్యాపారములచే ప్రకాశిం

చుదాసివలెనుండియు ఆ ఎల్ల ఇంద్రియ వ్యాపారములకు సం బంధములేనిది ఎల్ల ప్రపంచములు ధరించినదయిన్నీ ఎందుల తగులకయుండునది త్రిగుణాత్మకముగానిదయిన్నీ సత్వరజస్త మోగుణములను అనుభవించునట్టిది.

బహిరంతశ్చభూతానా మచరంచర మేవచ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థంచాంతికేచతత్. 16

భూతానాం- ప్రాణులయొక్క; అంతశ్చ - లోపలనున్ను; బహిశ్చ-వెలుపలనున్ను; తత్-ఆబ్రహ్మము; అచరం - స్థావర రూపముగానున్ను; చరంచ - జంగమరూపముగానున్ను; సూక్ష్మత్వాత్ -రూపము లేకయుండుటవలన; తత్ -ఆబ్రహ్మము; అవిజ్ఞేయం- తెలియనశక్యమైనదిగానున్ను; దూరస్థం-పొందన శక్యమైనదిగానున్ను; అంతికేచ - సమీపమందున్నదని భావము.

ఆబ్రహ్మము ఎల్లచరాచరములయందు లోపల బైట వుం డునది. మిగుల సూక్ష్మమైన రూపముగలిగినది గావున తెలిసి కొన అశక్యమైనది, అజ్ఞానికి దూరముగాను జ్ఞానికి దాపుగా ను వున్నట్టిది.

అవిభక్తంచభూతేషు విభక్తమివచస్థితమ్।
భూతభర్తృచతత్ జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణుచ. 17

తత్-ఆబ్రహ్మము; అవిభక్తంచ- అపరిచ్ఛిన్నమైనదై; భూతేషు-సమస్తప్రాణులయందు; విభక్తమివ- పరిచ్ఛిన్నమైన దానివలె; స్థితం-ఉన్నది; భూతభర్తృ-భూతముల భరించునట్టి దిన్ని; గ్రసిష్ణు-గ్రహించునట్టిదిన్ని; ప్రభవిష్ణు-ఉత్పత్తిచేయున ట్టిదిన్ని; తత్ - అబ్రహ్మము; జ్ఞేయం-తెలియదగినది.

ఆబ్రహ్మము అపరిచ్ఛిన్నమయున్న ఎల్ల జీవకోట్లయందు పరిచ్ఛిన్నమైనదానివలె నుండునట్టిది, సమస్తభూతములనుమో యునట్టిది గ్రహించునట్టిది మరల పుట్టించునట్టిది అని యె ఱుగుము.

జ్యోతిషామపితజ్జ్యోతి స్తమసఃపరముచ్యతే।

జ్ఞానంజ్ఞేయంజ్ఞానగమ్యం హృదిసర్వస్యవిష్ఠితమ్. 18

తత్-అబ్రహ్మము; జ్యోతిషామపి - సూర్యాది తేజస్సులకు న్ను జ్యోతిప్రకాశమైనదిన్ని; తమసః - అజ్ఞానముకంటె; ప రం-వ్యతిరిక్తమైనదిన్ని; జ్ఞానం-ప్రకాశమైనదిన్ని; జ్ఞేయం- తె లియదగినదిన్ని; జ్ఞానగమ్యం - జ్ఞానగోచరమైనదిన్ని;సర్వస్య- సమస్తప్రాణులకొరకు; హృది-హృదయమందు; విష్ఠితం- ఉ న్నదిన్ని; (అని ఈరీతిగా), ఉచ్యతే - చెప్పబడుచున్నది.

ఆబ్రహ్మము జ్యోతిస్వరూపులైన సూర్యాదులకు ప్రకాశ కమైనదనియు అజ్ఞానమునకు వ్యతిరిక్తమయినదనియు తెలి

యదగినదియు జ్ఞానగోచరమయినదియు యెల్లప్రాణులమనస్సులయందున్నదనియు పెద్దలుజెప్పుదురు.

ఇతిక్షేత్రంతథాజ్ఞానం జ్ఞేయంచోక్తంసమాసతః।
మద్భక్తఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. 19

ఇతి-ఈప్రకారముగా; క్షేత్రంచ-క్షేత్రమును; తథా-అలాగుననే; జ్ఞానంచ-జ్ఞానమును; జ్ఞేయంచ-తెలియదగినదిన్ని; సమాసతః-సంగ్రహముగా; ఉక్తం - చెప్పబడెను; మద్భక్తః-నాభక్తుడు; ఏతత్-ఈఅర్థమును; విజ్ఞాయ-తెలుసుకొని; మద్భావాయ-నాస్వభావముకొఱకు; ఉపపద్యతే-అర్హుడగుచున్నాడు.

ఈవిధముగ క్షేత్రమును జ్ఞానము జ్ఞేయమును సూక్ష్మముగా నీకుజెప్పితిని, ఈఅర్థమును యెరిగిన మద్భక్తుడునాస్థానమైన మోక్షమునకు అర్హుడగుచున్నాడు.

ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి।
వికారాంశ్చగుణాంశ్చైవ విద్ధిప్రకృతిసంభవాన్. 20

ప్రకృతిం-క్షేత్రమున్ను; పురుషంచ-క్షేత్రజ్ఞునిన్ని; ఉభావపి-ఈరెంటినిన్ని; అనాదీ-నిత్యములుగాను; విద్ధి- తెలియుము; వికారాంశ్చ-బుద్ధ్యాదివికారరూపములను; గుణాంశ్చ-గుణములనున్ను; ప్రకృతిసంభవానేవ - ప్రకృతివలనబుట్టినవానిగానే; విద్ధి- తెలియుము.

ప్రకృతిపురుషులు ఇద్దరు అనాదులని తెలుసుకొమ్ము మనో బుద్ధులకు గలుగు వికారములున్ను సత్వ రజస్తమోగుణములున్ను మూలప్రకృతివల్లగలిగినవిగా తెలుసుకొమ్ము.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. 21

ప్రకృతిః—మాయ; కార్యకారణకర్తృత్వే - శరీరసుఖఃదుఖాదులను పుట్టించుటయందు; హేతుః—కారణమని; ఉచ్యతే- చెప్పబడుచున్నది; పురుషః—క్షేత్రజ్ఞుడు; సుఖదుఃఖానాం— సుఖదుఃఖములయొక్క; భోక్తృత్వే—అనుభవించుటయందు; హేతుః—కారణమని; ఉచ్యతే—చెప్పబడుచున్నాడు.

ప్రకృతికి మాయయను కూడా నామముగలదు. ఆమాయ శరీరసుఖదుఃఖాదులను పుట్టించుటకు కారణమని తెలిసికొమ్ము. క్షేత్రజ్ఞుడనెడివాడు సుఖదుఃఖము లనుభవించుటకు కారణమని తెలిసికొమ్ము.

పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణంగుణసంగోస్య సదసద్యోనిజన్మసు. 22

పురుషః—పురుషుడు; ప్రకృతిస్థః- ప్రకృతియందున్నవాడు; ప్రకృతిజాన్—ప్రకృతివలనబుట్టిన; గుణాన్ - గుణములను; భుఙ్క్తే - అనుభవింపుచున్నాడు; అస్య- ఈపురుషునికి; గుణసం

గః-సుఖదుఃఖాదిగుణాసక్తి; సదసద్యోనిజన్మసు- పుణ్యాపుణ్య రూపయోనులజన్మించుటయందు; కారణం-హేతువు; భవతి- అగుచున్నది.

క్షేత్రజ్ఞుడనుపురుషుడుక్షేత్రమనే ప్రకృతియందుండున్నవాడు ప్రకృతివల్లబుట్టిన గుణములను పురుషుడనుభవించుచున్నాడు. ఈ పురుషునికి సుఖదుఃఖ రూపములయిన గుణములయం దాసక్తియుండుటచేత పుణ్యాపుణ్య రూపములయిన యోనుల యందు జన్మములకు కారణమగుచున్నది.

ఉపద్రష్టానుమంతాచ భర్తాభోక్తామహేశ్వరః।
పరమాత్మేతిచాప్యుక్తో దేహేస్మిన్ పురుషఃపరః. 23

ఉపద్రష్టా-కార్యకారణ వ్యాపారములయందు ఉపద్రష్టయైనట్టిన్ని; అనుమంతా-అనుమోదించునట్టిన్ని; భర్తా-భరించునట్టిన్ని; భోక్తా- అనుభవించునట్టిన్ని; మహేశ్వరః - నియామకుడైనట్టిన్ని; పరమాత్మేతి- పరమాత్మయని; ఉక్తః- చెప్పబడినట్టి; పురుషః-క్షేత్రజ్ఞుడు; అస్మిన్ దేహే - ఈదేహమందు; పరః-ఉత్కృష్టుడైనవాడు.

ఈ క్షేత్రమనేదేహమందు క్షేత్రజ్ఞుడనే పురుషుడు కార్యకరణవ్యాపారములయందు ఉపద్రష్టయై అనుమోదించువాడై భరించువాడై అనుభవించువాడై నియామకుడై ఉత్కృష్టుడై

పరమాత్మగానున్నవాడు.

యఏవంవేత్తిపురుషం ప్రకృతించగుణైస్సహ।
సర్వథావర్తమానోపి నసభూయోభిజాయతే. 24

**యః**-ఎవ్వడు; ఏవం-ఈప్రకారముగా; పురుషం- క్షేత్రజ్ఞు నిన్ని; గుణైస్సహ-**వికారములతో**కూడ; ప్రకృతించ-ప్రకృతి నిన్ని; వేత్తి-యెరుంగుచున్నాడో, సః-వాడు; సర్వథా- సర్వ **ప్రకారములచేత**; వర్తమానోపి- ఉన్నవాడైనా; భూయః- తిరిగిన్ని; నాభిజాయతే-పుట్టడు,

ఎవరైతే క్షేత్రజ్ఞుడగుచున్న పురుషునిన్ని క్షేత్రమను ప్రకృతి నిన్ని పైచెప్పినప్రకారము తెలిసికొనెదరో అట్టివారు ఏస్వ **భావము**తోనైటి వర్తించినా వారికి పునర్జన్మములు లేవు.

ధ్యానేనాత్మనిపశ్యంతి కేచిదాత్మానమాత్మనా।
అన్యేసాంఖ్యేనయోగేన కర్మయోగేనచాపరే. 25

కేచిత్-కొందరు; ధ్యానేన-ధ్యానముచేత; ఆత్మని- బుద్ధి యందు, ఆత్మనా-మనస్సుచేత; ఆత్మానం - పరమాత్మను; ప శ్యంతి-చూచుచున్నారు; అన్యే-మరికొందరు; సాంఖ్యేనయో గేన-జ్ఞానముచేతనున్ను, అపరే - మరికొందరు; కర్మయోగే న; నిష్కామకర్మయోగముచేతనున్ను; ఆత్మానం-పరమా త్మను; పశ్యంతి-చూచుచున్నారు.

కొందఱు ధ్యాననిష్ఠులై మనస్సుచే తమలో నంతర్గతమైన పరమాత్మను చూచుచున్నారు. కొందఱు జ్ఞాన యోగము చేతను మఱికొందరు నిష్కామమయిన కర్మ యోగముచేతను పరమాత్మను చూచుచున్నారు.

అన్యే త్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపిచాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. 26

అన్యేతు-మరికొందరైతే; ఏవం- ఈ ప్రకారముగా; అజానంతః-పరమాత్మను యెరుగనివారలై; అన్యేభ్యః-ఇతరులైన ఆచార్యులవలన; శ్రుత్వా విని; ఉపాసతే - ఉపాసనను చేయుచున్నారు; శ్రుతిపరాయణాః - వేదాంతశ్రవణపరులైన; తేఽపి-వారలును, మృత్యుం-మృత్యువును, అతితరంత్యేవ-అతిక్రమించుచున్నారు.

మఱికొందరు పరమాత్మను పైజెప్పిన శ్లోకములచే తెలియనివారై గురువులవలన ఉపదేశమునుపొంది ఉపాసన చేయుచున్నారు. వారును భక్తిశ్రద్ధలతో వేదాంతము విను చుందురు గనుక మరల జన్మములు లేని వారగుదురు.

యావత్సంజాయతే కించిత్ సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 27

హేభరతర్షభ - ఓయి అర్జున; స్థావరం జంగమం-

స్థావరజంగమాత్మకమైన; కించిత్-స్వల్పమైన; సత్త్వం- వస్తు వు; యావత్ - ఎంతయైన; సంజాయతే - పుట్టుచున్నదో; తత్-ఆవస్తువు; క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్-ప్రకృతిపురుషసంసర్గము వలనకలిగినదని; విద్ధి- తెలియుము.

ఓ అర్జున! లోకమున చరాచరవస్తువులు ఎన్నిసార్లు పుట్టుచున్నవో అంతమువరకు క్షేత్రక్షేత్రజ్ఞులయినప్రకృతి పురుషులకు రజ్జుసర్ప భ్రాంతివలె సంసర్గముగలిగి యున్నదని యెఱుఁగుము,

సమంసర్వేషుభూతేషు తిష్ఠంతంపరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యంతం యఃపశ్యతిసపశ్యతి. 28

యః-ఎవ్వఁడు; సర్వేషు భూతేషు-సమస్తప్రాణులయందు; సమం - సమముగా, తిష్ఠంతం- ఉన్నటువంటి; పరమేశ్వరం-పరమేశ్వరుని; తేషు-ఆప్రాణులు, వినశ్యత్సు - నశింపుచుండగానున్ను; అవినశ్యంతం-నశించకయున్నవానిగాను; పశ్యతి-చూచుచున్నారో; సః-వారు; పశ్యతి-చూచుచున్నారు.

మాయారూపకమై నశించఁగల ప్రపంచ స్వరూపములయందు చేరినదై సమముగానడచుకొను పరమేశ్వరుని శాశ్వతుఁడని ఏ మనుష్యులు యెఱుఁగుచున్నారో అట్టివారే తెలిసినవారని చెప్పబడుదురు.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్. 29

హి—ఏకారణమువలన; సర్వత్ర—సమస్తప్రాణులయందు; సమం-సమముగా; సమవస్థితం—ఉన్నట్టి; ఈశ్వరం—పరమేశ్వరుని; పశ్యన్—చూచుచున్నవాడు, ఆత్మనాత్మనచేత; ఆత్మానం—పరమాత్మను; నహినస్తి-హింసజేసినవాడుకాడో; తతః- అందువలన; పరాం—ఉత్కృష్టమైన; గతిం - మోక్షమును; యాతి-పొందుచున్నాడు.

అట్టివారు ఎల్ల ప్రాణులయందు అంతర్గతమయిన పరమాత్మ ఒకటియేయని యెఱిగినవారు గనుక తమలో నంతర్గతమైన పరమాత్మను చింతిల్లచేయరు. అందువల్ల వారు ఉత్కృష్టమయిన మోక్షమును బొందుచున్నారు.

ప్రకృత్యైవచకర్మాణి క్రియమాణానిసర్వశః।
యః పశ్యతితథాత్మాన మకర్తారంసపశ్యతి. 30

యః— ఎవ్వడు; కర్మాణి – కర్మములను; ప్రకృత్యైవ—మాయచేతనే; సర్వశః— సర్వప్రకారములుగా; క్రియమాణాని—చేయబడుచున్నవానినిగా; యథా – ఎప్పుడు; పశ్యతి- చూచుచున్నాడో; తథా – అప్పుడు; సః—వాడు; ఆత్మానం— క్షేత్ర

జ్ఞుని; అకర్తారం - ఉపాధిరహితునిగా; పశ్యతి - చూచుచున్నాడు,

ఎల్ల కర్మములు ప్రకృతి సంబంధమైన గుణములచే జేయబడినవిగా ఎవడు గ్రహించుచున్నాడో వాడు తనలోనంతర్గతమైన క్షేత్రజ్ఞుని ఉపాధిరహితునిగా ఎరుగుచున్నాడు.

యదాభూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి।
తతఏవచవిస్తారం బ్రహ్మసంపద్యతేతదా 31

యదా-ఎప్పుడు; భూతపృథగ్భావం-భూతభిన్నభావమును; ఏకస్థం - ఒకదానియందున్నదానినిగా; అనుపశ్యతి- చూచుచున్నాడో; యదా-ఎప్పుడు; తతఏవచ- ఆయాత్మవలననే; విస్తారం-ఉత్పత్తిని; అనుపశ్యతి - చూచుచున్నాడో; తదా-అప్పుడు; బ్రహ్మ-బ్రహ్మము; సంపద్యతే - అవుచున్నాడు.

పృథక్రూపములుగనుండు ఎల్ల భూతములు ఆత్మయందున్నవిగాను ఆ ఒక ఆత్మవలననే ఈఎల్ల ప్రపంచములు పుట్టినవిగాను ఎవడు తెలుసుకొనుచున్నాడో అతడు పరబ్రహ్మస్వరూపుడగుచున్నాడు.

అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోపికౌంతేయ నకరోతి నలిప్యతే. 32

హేకౌంతేయ-ఓయి అర్జున; అనాదిత్వాత్ - మొదలు

లేకపోవుటవలనను; నిర్గుణత్వాత్ - గుణము లేకపోవుటవల
నను; అవ్యయః-నాశరహితుండైన; అయంపరమాత్మా- ఈ
పరమాత్మ; శరీరస్థోపి-శరీరమందున్నప్పటికిని; నకరోతి-(కర్మ
మను) చేయడు; నలిప్యతే-కర్మఫలములయందును అంటడు.

ఓ అర్జున! పరమాత్మ ఆదిలేనివాడై నాశరహితుడై గుణ
రహితుడైనవాడు గాన అట్టి పరమాత్మ దేహాంతర్గతుడయ్యు
ను కర్మలుజేయువాడు కాడు. కర్మఫలములనుభవించు వా
డును కాడు.

**యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।**
**సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే 33**

**యథా** - ఏప్రకారముగా; ఆకాశం-**ఆకాశము**; సర్వగతం-
సర్వవ్యాపియైనప్పటికిని; సౌక్ష్మ్యాత్ - సూక్ష్మమవుటవలన;
నోపలిప్యతే-సంబంధించదో; **తథా**-అప్రకారముగా; ఆత్మా-
**క్షేత్రజ్ఞుడు**; దేహే-శరీరమందు; సర్వత్ర - అంతటను; **అవస్థి
తః**-ఉన్నవాడైనప్పటికిని; నోలిప్యతే-అంటడు.

**ఆకాశము** సూక్ష్మరూపమగుటవలన అంతట వ్యాపించిన
కయిన్ని వస్తువుల నేలాగంటదో **ఆవిధము**గ **క్షే**త్రజ్ఞుడైన పు
రుషుడు **క్షే**త్రములయిన దేహములయందున్నను కర్మలకు సం
బంధపడినవాడు కాడు.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 34

హే భారత- ఓయిఅర్జునా; యథా-ఏప్రకారము; ఏకః- ఒకడైన; రవిః- సూర్యుడు; కృత్స్నం-సమస్తమైన; ఇమం లోకం-యీజగత్తును; ప్రకాశయతి - ప్రకాశింపజేయుచున్నాడో; తథా-అలాగుననే; క్షేత్రీ-క్షేత్రజ్ఞుడు; కృత్స్నం - సమస్తమైన; క్షేత్రం-శరీరమును; ప్రకాశయతి - ప్రకాశింపజేయుచున్నాడు.

ఓ అర్జునా! ఒకసూర్యుడు ఎల్ల జగత్తులను ఏ విధముగ ప్రకాశింప జేయుచున్నాడో ఆవిధముగ క్షేత్రజ్ఞుడనే పురుషుడు ఎల్లక్షేత్రములనే దేహములను ప్రకాశింప జేయుచున్నాడు

క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ మంతరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యేవిదుర్యాంతి తేపరమ్. 35

ఏవం - ఈప్రకారము; క్షేత్రక్షేత్రజ్ఞయోః- ప్రకృతిపురుషులయొక్క; అంతరం - విలక్షణత్వమును; భూతప్రకృతి మోక్షంచ-భూత; భూతములయొక్కయు; ప్రకృతి-మాయయొక్కయు; మోక్షంచ - అభావగమనమును; జ్ఞానచక్షుషా-జ్ఞానదృష్టిచేత; యే-ఎవరు; విదుః-ఎఱుంగుచున్నారో; తే-వారలు; పరం-పరబ్రహ్మమును; యాంతి-పొందుచున్నారు

ఎవరైతే పై చెప్పినరీతిగ క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదమునున్ను భూతముల ప్రకృతిని వృత్త్యపాయమునున్ను జ్ఞానదృష్టిచే ఎఱుగుచున్నారో వారలు పరబ్రహ్మమును జెందుచున్నారు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగోనామ
త్రయోదశోధ్యాయః.

ఇట్లు ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును,
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బైన క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమనెడి
త్రయోదశోధ్యాయము ముగిసినది.

శ్రీ భగవద్గీత.

గుణత్రయ విభాగ యోగో నామ
చతుర్దశోధ్యాయః.

శ్రీ భగవాన్ ఉవాచ.

పరంభూయఃప్రవక్ష్యామి జ్ఞానానాంజ్ఞానముత్తమమ్।
యద్జ్ఞాత్వామునయస్సర్వే పరాంసిద్ధిమితోగతాః. 1

జ్ఞానానాం - జ్ఞానములలోపల; ఉత్తమం-శ్రేష్ఠమయిన; పరం-ఉత్కృష్టమైన; జ్ఞానం-జ్ఞానమును; భూయః-మరల; ప్రవక్ష్యామి- చెప్పుగలను; యత్-ఏజ్ఞానము; జ్ఞాత్వా-ఎఱిఁగి; సర్వే మునయః- సమస్తఋషులును; ఇతః-ఇంతకంటె;పరాం-ఉత్కృష్టమైన; సిద్ధిం-గతిని; గతాః-పొందిరో.

జ్ఞానమున మిక్కిలి ఉత్కృష్టమయిన జ్ఞానమును మరల నీకుగాను చెప్పుచున్నాను. అట్టి జ్ఞానము పుట్టియేగదా అనేక ఋషులు శ్రేష్ఠమయిన మోక్షమును పొందిరి.

ఇదంజ్ఞానముపాశ్రిత్య మమసాధర్మ్యమాగతాః।
నసర్గేపినోపజాయంతే ప్రళయేనవ్యథంతిచ. 2

ఇదంజ్ఞానం-ఈజ్ఞానసాధనమును; ఉపాశ్రిత్య-పొంది, మమ-నాయొక్క; సాధర్మ్యం- స్వరూపమును; ఆగతాస్సంతః-పొందినవారలై; సర్గేపి-సృష్టికాలమందును; నోపజాయంతే-పుట్టరు; ప్రళయే-ప్రళయకాలమందు; నవ్యథంతిచ- వ్యధను బొందరు.

ఈ జ్ఞానమునుజెంది నాతోసమానులు బ్రహ్మసృష్టి కాలములోకూడ జన్మములుపొందరు. బ్రహ్మప్రళయకాలములోనున్ను దుఃఖమును జెందరు.

మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

హే భారత- ఓయి అర్జునుడా; మహత్ - అధికమైన; మమ-నాయొక్క; బ్రహ్మ-అపరప్రకృతి; యోనిః- భూతసృష్టి కారణము, తస్మిన్-ఆప్రకృతియందు; అహం-నేను; గర్భం-గర్భమును; దధామి-ఉంచుచున్నాను; తతః-దానివలన; సర్వభూతానాం-సమస్తప్రాణులయొక్క; సంభవః - ఉత్పత్తి; భవతి-అవుచున్నది.

ఓ అర్జున! పరబ్రహ్మమైన నాకు ప్రకృతియనునది భూతసృష్టికారణముగానున్నది, అట్టి ప్రకృతియందు నా అంశములు వుంచినవెనుక ఎల్లభూత ప్రపంచములు పుట్టుచున్నవి.

సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా. 4

హే కౌంతేయ- ఓయిఅర్జునుడా; సర్వయోనిషు-సమస్తయోనులయందును; యాః మూర్తయః - ఏ దేహసంస్థానలక్షణములు; సంభవంతి - పుట్టుచున్నవో; తాసాం- ఆదేహములకు; మహత్ - అధికమయిన; బ్రహ్మ-ప్రకృతి; యోనిః- తల్లి; అహం - నేను; బీజప్రదః-గర్భాధానకర్తయైన; పితా-తండ్రిని.

ఓ అర్జునా! ప్రపంచమునబుట్టు ఎల్ల చరాచర సమూహములకు ప్రకృతితల్లివంటిది. పరబ్రహ్మస్వరూపుడైననేను బీజము.

సత్త్వరజస్తమఇతిగుణాః ప్రకృతి సంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. 5

హే మహాబాహో- ఓయి అర్జునుఁడా; ప్రకృతిసంభవాః- భగవన్మాయవలన ఉత్పత్తిగలిగిన; సత్త్వం-సత్త్వమును; రజః-రజస్సును; తమఇతి-తమమునని రొండి; గుణాః- గుణములు; అవ్యయం - నాశరహితుడైన; దేహినం- క్షేత్రజ్ఞుని; దేహే- దేహమందు; నిబధ్నంతి-అరిగట్టుచున్నవానివలెనున్నవి; స్వభావమువలన నాత్మను నాస్పదముగా జేసుకొని పొందుచున్నవిగనుక యరిగట్టుచున్నవని చెప్పఁబడెను.

ఓ అర్జునా! ప్రకృతివల్లనే సత్త్వరజస్తమములనెడి గుణములు పుట్టినవి, ఆగుణములు ప్రకృతిసంబంధమైన దేహమందు చేరినదిగాను నశించనివాడుగా నుండెడివానిని బద్ధుని జేయుచున్నవి.

తత్రసత్త్వం నిర్మలత్వా త్ప్రకాశకమనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేనచానఘ. 6

హే అనఘ- ఓయి పాపరహితుడవైన అర్జునా; తత్ర- ఆసత్త్వరజస్తమోగుణములలోపల; నిర్మలత్వాత్ - స్వచ్ఛ

మాటపలన; ప్రకాశకం - స్ఫటికమణివలె ప్రకాశించు చేయున ట్టి; అనామయం-ఉపద్రవరహితమైన;సత్త్వం- సత్వగుణము; సుఖసంగేన - సుఖసంగముచేతను; జ్ఞానసంగేన-అంతఃకర ణధర్మముచేతను; బధ్నాతి-దేహినికట్టుచున్నది.

ఓ అర్జున! ఆమూడుగుణములలో సత్త్వగుణముస్వచ్ఛ మైనది నిర్మలముగ ప్రకాశించునది ఉపద్రవరహితమైనది. ఆ గుణము క్షేత్రజ్ఞుని సుఖముతోను జ్ఞానముతోను కట్టుచున్నది.

రజోరాగాత్మకంవిద్ధి తృష్ణాసంగ సముద్భవమ్।
తన్ని.బధ్నాతి కౌంతేయ కర్మసంగేనదేహినమ్. 7

హే కౌంతేయ- ఓయిఅర్జున; తృష్ణాసంగ సముద్భవం- తృష్ణా-రానివస్తువును కోరుటవలనను; సంగ-ప్రాప్తమైనవిష యములయందు, మనఃప్రీతి గలిగియుండుట వలనను; సముద్భ వం-ఈరెంటివలనబుట్టిన; రజః-రజోగుణమును; రాగాత్మకం- అనురంజనస్వరూపమైన దానినిగా; విద్ధి- తెలియుము; తత్- ఆరజోగుణము; దేహినం-దేహిని; కర్మసంగేన - కర్మాసక్తి చేత; నిబధ్నాతి-కట్టుచున్నది.

ఓ కౌంతేయ! రజోగుణము కోరికల స్వరూపమై ప్రాప్త మైన విషయములయందు అభిమానముపుట్టించుచున్నది. అది దేహిని కర్మాసక్తితో బద్ధుని జేయుచున్నది.

తమ స్త్వజ్ఞానజంవిద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. 8

హే భారత- ఓఅర్జున; సర్వదేహినాం-సమ స్తప్రాణుల కును; మోహనం - మోహకరమైన; తమ స్తు-తమోగుణము నైత్తే; అజ్ఞానజం-అజ్ఞానమువలనం బుట్టినదానినిగా; విద్ధి- తెలియుము; తత్ - అతమోగుణము; ప్రమాదాలస్య నిద్రాభిః- ప్రమాదాలస్యనిద్రలచేత; నిబధ్నాతి-కట్టుచున్నది.

ఓ అర్జున! తమోగుణము అజ్ఞానమువలన బుట్టినది. అది ఎల్లప్రాణులను మోహింపజేయుచున్నది. ఆగుణము దేహిని ఆలస్యముతోను నిద్రతోను అజాగ్రతతోను బద్ధుని జేయుచున్నది.

సత్త్వం సుఖే సంజయతి రజకర్మణిభారత।
జ్ఞానమావృత్యతుతమః ప్రమాదే సంజయత్యుత. 9

హే భారత- ఓయి అర్జున; సత్త్వం - సత్త్వగుణము, సుఖే-సుఖమందు; సంజయతి - కూర్చుచున్నది; రజః- రజోగుణము; కర్మణి - కర్మమందు; సంజయతి - కూర్చుచున్నది; తమః-తమోగుణము; జ్ఞానం - జ్ఞానమును; ఆవృత్య- కప్పి; ప్రమాదే-మరచియుండుటయందు; సంజయతి - కూర్చుచున్నది; ఉత-ఆశ్చర్యము.

ఓ అర్జున! సాత్వికము సుఖమందు వర్తింప జేయునది. రజోగుణము కర్మయందు వర్తింపజేయునది. తమోగుణము జ్ఞానమును దాచి ప్రమాద కార్యములయందు వర్తింప జేయునది.

రజస్తమశ్చాభిభూయ సత్త్వ భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. 10

హే భారత–ఓ యి అర్జున; రజశ్చ– రజస్సును; తమశ్చ–తమస్సును; అభిభూయ–తిరస్కరించి, సత్త్వం–సత్త్వగుణము; భవతి–కలుగుచున్నది; రజః–రజస్సును; సత్త్వం - సత్త్వమును; అభిభూయః-తిరస్కరించి; తమశ్చ - తమోగుణము; భవతి–కలుగుచున్నది; తథా–అలాగుననే; తమః – తమస్సును; సత్త్వం–సత్త్వమును; అభిభూయ - తిరస్కరించి; రజః - రజోగుణము; భవతి–కలుగుచున్నది.

ఓ అర్జున! నత్వగుణమైనది రజస్తమోగుణములను తిరస్కరించిన అది కగలనిదిగాయుండును. రజోగుణమైనది ఇతరమైన రెంటిని తిరస్కరించిన అది నిలుచును, తమోగుణము ఇతరమైనవాటిని తిరస్కరించిన అది గట్టిగానిలుచును.

సర్వద్వారేషు దేహేస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానంయదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11

హే కౌంతేయ-ఓయి అర్జున; అస్మిన్ - ఈభోగస్థానమైన; దేహే-శరీరమందు; సర్వద్వారేషు - శ్రోత్రాదిసకలద్వారములయందు; యదా-ఎప్పుడు; జ్ఞానం-జ్ఞానస్వరూపమైన; ప్రకాశః-తెలివి; ఉపజాయతే-పుట్టుచున్నదో; తదా- అప్పుడు, సుఖాదిచిహ్నములవలన; సత్త్వం-సత్త్వగుణము; వివృద్ధమితి-వృద్ధిబొందినదని; విద్యాత్ - తెలియఁగలయును.

ఎవుడు ఈశరీరమందు శరీరద్వారములైన సజ్ఞానేంద్రియములమూలముగా జ్ఞానస్వరూపమైన ఆత్మానాత్మ తెలివి పుట్టుచున్నదో అపుడు సత్వగుణము హెచ్చినదని యెఱుఁగుము.

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్పృహా।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. 12

హే భరతర్షభ -ఓయి అర్జున; రజసి- రజోగుణము; వివృద్ధేసతి - వృద్ధిబొందుచుండగా; లోభః-పరద్రవ్యాదికాంక్షయు; ప్రవృత్తిః-సామాన్యచేష్టయు; కర్మణాం - కర్మములయొక్క; ఆరంభః-ఆరంభమును; అశమః- శమములేకపోవుటయు; స్పృహా-ఇచ్ఛయు; ఏతాని - ఈచిహ్నములు; జాయంతే-పుట్టుచున్నవి.

ఓ అర్జున! ఎప్పుడైతే ఈశరీరమందు ధనాపేక్షయు సామాన్యచేష్టయు కర్మాసక్తియు ఇంద్రియనిగ్రహము లేకపోవు

టయు కోరికయు పుట్టుచున్నవో అపుడు రజోగుణము హెచ్చె నదని యెరుగుము.

అప్రకాశో ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. 13

హే కురునందన-ఓ అర్జున; అప్రకాశః - వివేకము లేక పోవుటయు; మోహః-మోహమును; ఏతాని - ఈ లక్షణము లు; తమసి - తమోగుణము; వివృద్ధేసతి- వృద్ధిబొందుచుండ గా; జాయంతే - పుట్టుచున్నవి.

ఓ అర్జునా! ఎప్పుడైతే ఈ శరీరమందు అజ్ఞానము జబ్బు తనము వ్యవధిలేకపోవుట మోహము ఇది పుట్టుచున్నదో అ పుడు అపుడు తమోగుణము హెచ్చెనదని తెలియుము.

యదా సత్వే ప్రవృద్ధేతు ప్రళయంయాతి దేహభృత్।
తదోత్తమ విదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

దేహభృత్ - శరీరి; సత్వే- సత్వగుణము; సంవృద్ధే సతి-వృద్ధిబొందుచుండగా; యదా - ఎప్పుడు; ప్రళయం- మర ణమును; యాతి-పొందుచున్నాడో; తదా-అప్పుడు; అమలాన్- స్వచ్ఛములైన; ఉత్తమవిదాం-బ్రహ్మవేత్తలయొక్క; లో కాన్-లోకములను; ప్రతిపద్యతే-పొందుచున్నాడు.

సాత్వికము హెచ్చినదశలో మరణము కలిగినేని అవు

డు స్వచ్ఛమైన బ్రహ్మాదిలోకములను జెందుచున్నాడు.

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. 15

రజసి-రజోగుణము; ప్రవృద్ధేసతి – వృద్ధిబొందుచుండగా; ప్రళయం–మరణమును; గత్వా–పొంది; కర్మసంగిషు - మనుష్యులయందు; జాయతే–పుట్టుచున్నాడు; తథా–ఇలాగే; తమసి–తమోగుణము(ప్రవృద్ధేసతి-వృద్ధిబొందుచుండగా); ప్రలీనః-మృతుడైనవాడు; మూఢయోనిషు – శ్వసూకరాదియోనులయందు; జాయతే - పుట్టుచున్నాడు.

రజోగుణము హెచ్చైన స్థితిలో చావుసంప్రాప్తమాయెనేని కర్మాసక్తిగల మర్త్యలోకమందు పుట్టుచున్నాడు, తమోగుణము హెచ్చైన స్థితిలో మృత్యువు సంభవించెనేని శ్వానవరాహాది నికృష్ట జన్మముల నెత్తుచున్నాడు.

కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

శిష్టాః - పెద్దలు; సుకృతస్య-సత్త్వగుణమువలనబుట్టిన; కర్మణః- కర్మమునకు; సాత్త్వికం - సత్త్వ ప్రధానమయిన; నిర్మలం – ప్రకాశబహుళమైన; ఫలం – ఫలమును; ఆహుః–చెప్పుదురు; రజసస్తు– రజోగుణకర్మమునకు; ఫలం – ఫలమును;

దుఃఖం-దుఃఖకరమయినదానినిగా; ఆహుః-చెప్పుదురు; తథా-
ఆలాగుననే; తమసః- తామసకర్మమునకు; ఫలం- ఫలమును;
అజ్ఞానం-అజ్ఞానముగా; ఆహుః- చెప్పుదురు.

సాత్వికముచే జనించిన కర్మకు తేజముతో గూడిన జ్ఞాన
ము ఫలమనియు రజోగుణముచే బుట్టిన కర్మకు దుఃఖప్రాప్తి
ఫలమనియు తమోగుణముచే జనించిన కర్మకు అజ్ఞానముఫల
మనియు గొప్పవారు జెప్పుచున్నారు.

సత్వాత్సంజాయతే జ్ఞానం రజసోలోభయేవచ।
ప్రమాద మోహౌతమసో భవతోఽజ్ఞానమేవచ. 17

సత్వాత్ -సత్వగుణమువలన; జ్ఞానం- జ్ఞానము; సంజాయ
తే-పుట్టుచున్నది. రజసః-రజోగుణమువలన; లోభఏవ-లోభ
మే; సంజాయతే-పుట్టుచున్నది; తమసః-తమోగుణమువలన;
ప్రమోదమోహౌ-ప్రమోదమోహములు; భవతః-పుట్టుచు
న్నవి; అజ్ఞానంచ-అజ్ఞానమును పుట్టుచున్నది.

సాత్వికమువలన జ్ఞానమును, రజోగుణముచే లోభమును
జనించుచున్నవి. తమోగుణముచేఅజాగ్రత అజ్ఞానముకలుగు
చున్నవి.

ఊర్ధ్వంగచ్ఛంతి సత్వస్థా మధ్యేతిష్ఠంతి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతితామసాః. 18

సత్త్వస్థాః-సాత్త్వికులు; ఊర్ధ్వం - దేవాదిలోకములను; గచ్ఛంతి - పొందుచున్నారు; రాజసాః-రజోగుణవృత్తిగలవారలు; మధ్యే - మనుష్యలోకమందు; తిష్ఠంతి- ఉంచుచున్నారు; జఘన్యగుణవృత్తిస్థాః-నికృష్టగుణవృత్తియందున్న; తామసాః-తమోగుణముగలవారలు; అధః-పశ్వాదియోనులయందు; గచ్ఛంతి - జన్మమునుబొందుచున్నారు.

సాత్త్వికులు దేవాది లోకములను జెందుచున్నారు. రజోగుణము గలవారు మానుష లోకమందు మనుజులుగా జన్మించుచున్నారు. నికృష్టవ్యాపారమునందున్న తమోగుణస్థులు పశ్వాది జన్మములను నరకములను జెందుచున్నారు.

నాన్యంగుణేభ్యఃకర్తారం యదాద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చపరంవేత్తి మద్భావంసోఽధిగచ్ఛతి. 19

యదా-యెప్పుడు, ద్రష్టా-తెలిసినవాడు-గుణేభ్యః - విషయములకంటె; అన్యం - ఇతరమును; కర్తారం - కర్తగాను; నానుపశ్యతి-చూడడో (ఇదియునుంగాక); గుణేభ్యః-గుణములకంటె; పరం-వ్యతిరిక్తుడయిన; (గుణవ్యాపారసాక్షిభూతుని); వేత్తి-తెలియుచున్నాడో; అప్పుడు; సః-వాడు;మద్భావం-నాస్వరూపమును; అధిగచ్ఛతి - పొందుచున్నాడు.

ఎవడైతే గుణములే కర్తలనియు తాను సాక్షికారణముని

యు లేఁటుఁగుచున్నాడో వాడు నా స్వరూపమును జెందుచు
న్నాడు.

గుణానేతానతీత్యత్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే. 20

దేహీ-శరీరముగలవాడు; దేహసముద్భవాన్ - దేహము
వలనబుట్టిన; త్రీన్-మూడయిన; ఏతాన్ గుణాన్- ఈగుణములు
ను; అతీత్య-అతిక్రమించి; జన్మమృత్యుజరాదుఃఖైః+జన్మమృ
త్యుజరాదుఃఖములచేత; విముక్తస్సన్ - విడువబడిన వాడై;
అమృతం-మోక్షమును; అశ్నుతే- పొందుచున్నాడు.

ఎవడైతే దేహోత్పత్తి కారణములయిన ఈ మూడుగు
ణములను దాటిపోవుచున్నాడో వాడు జన్మమృత్యుజరాదుఃఖ
ములచే విడువబడినవాడై మోక్షమును జెందుచున్నాడు.

అర్జున ఉవాచ.

కైర్లింగై స్త్రీన్ గుణానేతా నతీతో భవతిప్రభో।
కిమాచారః కథంచైతాం స్త్రీన్ గుణానతివర్తతే. 21

అర్జునుడు పృచ్ఛచేయుచున్నాడు. హేప్రభో-ఓస్వామీ;
కైర్లింగైః - ఏచిహ్నములచేత; త్రీన్-మూడయిన; ఏతాన్
గుణాన్-ఈగుణములను; అతీతః - అతిక్రమించినవాడు; భవ
తి-అవుచున్నాడు; కిమాచారః - వాడుయెట్టిఆచారముగలవా

డు; కథం-యెట్లు; త్రీనేతాన్ గుణాన్ -ఈమూడుగుణములను; అతివర్తతే - అతిక్రమించుచున్నాడు.

ఓ కృష్ణ! ఈ త్రిగుణములను అతిక్రమించినవానికి ఏమిగుఱుతు లుండును. వాడి ఆచారము ఎట్టిది, అతిక్రమించుటకు మార్గమెట్టిది,

శ్రీ భగవాన్ ఉవాచ.

ప్రకాశంచప్రవృత్తించ మోహమేవచపాండవ!
నద్వేష్టిసంప్రవృత్తాని ననివృత్తానికాంక్షతి. 22

హే పాండవ- ఓయి అర్జునా! త్రిగుణాతీతుడైనవాడు, సంప్రవృత్తాని-సంప్రాప్తములయిన; ప్రకాశంచ - సత్వగుణకార్యములున్ను; ప్రవృత్తించ - రజోగుణకార్యమును ; మోహమేవచ-తమోగుణకార్యమును; నద్వేష్టి-ద్వేషింపడు; నివృత్తానిచ-పోయినసత్వాదికార్యములను; నకాంక్షతి-కోరడు.

ఓ అర్జున! త్రిగుణాతీతుడు ప్రకృతివల్లజనించినసత్వగుణసంప్రాప్తమైన జ్ఞాననిష్ఠ గలిగినప్పటికిని రజోగుణసంప్రాప్తమైన లోభకార్యము కలిగినా తమోగుణ సంప్రాప్తమైన అజ్ఞానకార్యము జరిగినా ద్వేషింపడు ఆయా పనులు ఆయాగుణముల యందణిగి నివృత్తిమైనపుడు వాటిని యిచ్ఛింపడు.

ఉదాసీనవదాసీనో గుణైర్యోనవిచాల్యతే।
గుణావర్తంతఇత్యేవ యోఽవతిష్ఠతినేంగతే. 23

ఉదాసీనవత్-పక్షపాతములేనివలె; ఆసీనః- ఉన్న; యః- ఎవ్వఁడు; గుణైః-గుణములచేత; నవిచాల్యతే - చలింపంబడఁడో; గుణాః-గుణములు; వర్తంతఇత్యేవ- వర్తించుచున్నవని; యః-ఎవ్వఁడు; అవతిష్ఠతి-ఉన్నాఁడో; నేంగతే-చలించఁడు.

త్రిగుణాతీతుఁడు గుణములయందును గుణకార్యములయందును లక్ష్యములేనివాఁడై ఉదాసీనుఁడుగా నుండును. జరిగెడి ఎల్లపనులు గుణవ్యాపారములని యెఱిఁగి చలించకయుండును.

సమదుఃఖసుఖఃస్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః. 24

సమదుఃఖసుఖః-సుఖదుఃఖములయందు సముఁడును, స్వస్థ- ఆత్మావలోకపరుఁడును; సమలోష్టాశ్మకాంచనః - బంగారును మట్టిగడ్డను రాతిని సమముగాఁ జూచువాఁడును; తుల్యప్రియాప్రియః- ప్రియాప్రియములయందు సముఁడును; ధీరః- ధైర్యముగలవాఁడును,

అతఁడు సుఖదుఃఖములను సమానముగ జూచుచు ఆత్మావలోకనము జేయుచు మట్టిపిండమును పాషాణము బంగారమును సరిగాఁ జూచుచు ఇష్టులయందును అయిష్టులయందును

సమదృష్టి యుంచును ధైర్యముగలవాడగును నిందా స్తుతుల యందు సమమైనవాడుగా నుండును.

మానావమానయోస్తుల్య స్తుల్యోమిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్సఉచ్యతే. 25

మానావమానయోః - మానావ మానములయందు; తుల్యః-సముడును; మిత్రారిపక్షయోః-శత్రుమిత్రపక్షములయందు; తుల్యః- సముడును; సర్వారంభపరిత్యాగీ - సమస్తకార్యారంభములవిడిచినవాడును; యః-ఎవ్వడో; సః-వాడు; గుణాతీతుడని; ఉచ్యతే-చెప్పబడుచున్నాడు.

మానావ మానములయందు సమదృష్టిగలవాడును శత్రుమిత్రులయందు సమమైన మనస్సు గలవాడును సకల పనులను పరిత్యాగించిన వాడును త్రిగుణాతీతుడని చెప్పబడును.

మాంచయోవ్యభిచారేణ భక్తియోగనసేవతే।
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే. 26

యః-ఎవ్వడు; మాం-నన్ను; అవ్యభిచారేణ- నిశ్చలమైన; భక్తియోగేన- భక్తియోగముచేత; సేవతే- సేవింపుచున్నాడో; సః-వాడు; ఏతాన్‌గుణాన్- ఈగుణములను; అతీత్య-అతిక్రమించి; బ్రహ్మభూయాయ - బ్రహ్మభావముకొఱకు; కల్పతే-సమర్థుడగుచున్నాడు.

ఎవఁడైతే చలింపని భక్తియోగముచే కొలుచుచున్నాఁడో వాఁడు త్రిగుణాతీతుఁడై బ్రహ్మభావము కొరకు సమర్థుఁడగుచున్నాఁడు.

బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్యచ।
శాశ్వతస్యచధర్మస్య సుఖస్యైకాంతికస్యచ. 27

హి-యేకారణమువలన; బ్రహ్మణః- పరమాత్మకు ప్రతిష్ఠా విగ్రహరూపము; అహం-నేను; అవ్యయస్య-నాశములేనట్టి; అమృతస్యచ-మోక్షమునకును; ప్రతిష్ఠా-ఆశ్రయము; అహం-నేను; శాశ్వతస్య-నిత్యమయిన; ధర్మస్యచ- ధర్మమునకున్ను; ప్రతిష్ఠా-ఆశ్రయము; అహం-నేను; ఐకాంతికస్య- ముఖ్యమయిన; సుఖస్య-సుఖమునకు; ప్రతిష్ఠా-ఆశ్రయము; అహం- నేను; అస్మి-అవుచున్నానో.

పరమాత్మ యొక్క విగ్రహ రూపమున్ను శాశ్వతమైన మోక్షమునకు ఆశ్రయమున్ను నిత్యమైనధర్మమునకు మూలస్థానమును మోక్షసుఖమునకు ఆశ్రయమున్ను నేనే యని తెలుసుకొమ్ము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ
విభాగ యోగోనామ చతుర్దశోధ్యాయః.

ఉపనిషద్ రూపములును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జునుల సంవాదరూపంబైన శ్రీ భగవద్గీతల యందు గుణత్రయ విభాగ యోగ మనెడి చతుర్దశోఽధ్యాయము ముగిసినది.

—•○•—

## శ్రీ భగవద్గీత.

### పురుషోత్తమ ప్రాప్తి యోగోనామ పంచ దశోఽధ్యాయః.

శ్రీ భగవానువాచ.

ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థంప్రాహురవ్యయం।
ఛందాంసియస్యపర్ణాని యస్తంవేదసవేదవిత్ 1

ఊర్ధ్వమూలం, ఊర్ధ్వ—బ్రహ్మము, మూలం - మూలముగా గలిగినట్టిన్ని; అధశ్శాఖం, అధః- మహదహంకారములు; శాఖం—శాఖలుగా గలిగినట్టి; అశ్వత్థం, "నశ్వోస్థిస్యతీత్యశ్వత్థః" అనగా క్షణప్రధ్వంసియనుట; (ఇట్టి సంసారవృక్షమును); అవ్యయం- మాయ అనాదికాల ప్రవృత్తమౌటవలన అట్టి మాయామయమయిన సంసారమును నాశరహితమైనదానిగాను; ప్రాహుః - చెప్పుదురు; యస్య—ఏ ఈఅశ్వత్థమునకు;

ఛందాంసి-వేదములు; పర్ణాని-ఆకులవంటివో; తం-ఆవృక్షమును; యః-ఎవ్వాడు; వేద-ఎరుఁగుచున్నాడో; సః-వాడు; వేదవిత్-వేదార్థమును తెలిసినవాడు.

శ్రేష్ఠమైన మాయాంశజనిత బ్రహ్మమే మూలముగా నిక్కష్టమైన మహదహంకారములు కొమ్మలుగా గల అశ్వత్థమ్మనెడి సంసారవృక్షము అనాదియని పెద్దలు చెప్పుదురు. అట్టి వృక్షమునకు వేదములు ఆకులు అట్టి వృక్షరూపమును ఎవడెరుగునో వాడు వేదార్థములను ఎఱిగినవాడగును.

అధశ్చోర్ధ్వంచ ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చమూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

తస్య-ఆసంసారవృక్షమునకు; శాఖాః- కొమ్మలవలెనున్న అవ్యక్తాదులు; గుణప్రవృద్ధాః - గుణములచేత స్థూలములుగా జేయబడినవై; విషయ ప్రవాళాః-స్సత్యః - శబ్దాదివిషయములు చిగుళ్లుగాగలవై; అధశ్చ-దిగువను; ఊర్ధ్వంచ-మీదను; ప్రవృత్తాః-విస్తృతంబులైనవి; తస్య - ఆవృక్షముయొక్క; మూలాని-రాగద్వేషాదులైన వేళ్లు; మనుష్యలోకే-మానవలోకమందు; కర్మానుబంధీనిసంతి-ధర్మాధర్మలక్షణమైనకర్

ర్మఫలముముందుగా గలిగినవై; అధశ్చ-క్రిందను; ఊర్ధ్వం చ-మీదను; అనుసంతతాని-ప్రవేశించినవి.

అట్టి సంసారవృక్షమునకు అజ్ఞానమనే కొమ్మలు త్రిగుణములచే సంరక్షింపబడి ఊర్ధ్వఅధోముఖములుగాను వ్యాపించియున్నది. ఆ కొమ్మలకు మర్త్యలోకమందు కర్మ ఫలములచే జనించిన రాగద్వేషాదులు మూలములుగాను శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు చిగుళ్ళుగాను వున్నవి.

నరూపమస్యే హతథోపలభ్యతే
నాంతోనచాది ర్నచసంప్రతిష్టా।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేనఛిత్వా. 3

ఇహ-ఈవృక్షమందున్న ప్రాణులచేత; అస్య- ఈసంసారవృక్షముయొక్క; రూపం - స్వరూపము; నోపలభ్యతే- తెలియబడదు; తథా-అలాగుననే; అంతః-తుదయున్న;ఆదిశ్చ-మొదలును; సంప్రతిష్టా-స్థితియున్న; నోపలభ్యతే- తెలియబడదు; సువిరూఢమూల; దృఢమయిన ప్రేళ్లుగలిగిన; ఏనం-ఈ; అశ్వత్థం - సంసారవృక్షమును; దృఢేన-దృఢమయిన;అసంగశస్త్రేణ-విరక్తియనెడునాయుధముచేత; ఛిత్వా-ఛేదించి.

ఈ సంసార వృక్షముయొక్క స్వరూపము తెలుసుకుట కళ

క్యము. దాని ఆద్యంతములుగాని స్థితిగానీ దెలియుటశక్యము. బహు దృఢమైన మూలములు గల ఈ వృక్షమును విరక్తియను వాడి ఆయుధముచే నఱుకవలయును.

తతఃపదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా ననివర్తంతిభూయః।
తమేవచాద్యం పురుషంప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ. 4

తతః-ఆతర్వాత; యస్మిన్-ఏపదమందు; గతాః-ప్రవేశించినవారలు; భూయః-మరల; ననివర్తంతి-తిరుగరో; యతః-ఎవనివలన; పురాణీ-అనాదియైన; ప్రవృత్తిః-సంసారవృక్షప్రవృత్తిప్రవర్తింపబడెనో; ఆద్యం-మూలకారణమయిన; తంపురుషం - ఆపరమాత్మను; ప్రపద్యే-శరణుపొందుచున్నానని; తత్పదం-ఆమోక్షస్థానము; పరిమార్గితవ్యం- వెదకదగినది.

అలాగు ఛేదించిన వెనుక ఏపరమాత్మవల్ల అనాదియైన సంసార ప్రవృత్తికలిగెనో ఏపరమాత్మను బొందినవారికి మరలజన్మములులేవో అట్టి పరమాత్మనే శరణుపొందుచున్నానని ప్రయత్నముచేయవలయును.

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।

ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయంతత్. 5

నిర్మానమోహాః - మానమోహములు లేనివారును; జితసంగదోషాః-జయింపబడిన సంగదోషములుకలిగినవారును; అధ్యాత్మనిత్యాః-జ్ఞానవిద్యాసక్తులయినవారును; వినివృత్తకామాః-పోయినఇచ్ఛలుకలిగినవారును; సుఖదుఃఖసంజ్ఞైః-శీతోష్ణాదిసుఖదుఃఖములనెడి సంజ్ఞలుగల; ద్వంద్వైః-ద్వంద్వములచేత; విముక్తాః-విడువబడిన; అమూఢాః-జ్ఞానులు; అవ్యయం-నాశరహితమయిన; తత్పదం- ఆస్థానమును; గచ్ఛంతి-పొందుచున్నారు.

జ్ఞానులు మాన మోహములు త్యజించి దారాపత్యాదుల సహవాసమును విడచి అధ్యాత్మజ్ఞాన విద్యాసక్తులై కామ క్రోధాదులు మాని శీతోష్ణాది రూపములయిన ద్వంద్వముల యందు సమానులై నాశరహితమైన మోక్షమును పొందు చున్నారు.

నతద్భాసయతేసూర్యో నశశాంకోనపావకః।
యద్గత్వాననివర్తంతే తద్ధామపరమంమమ. 6

తత్-ఆపరమపదమును; సూర్యః-సూర్యుడును; శశాంకశ్చ-చంద్రుడును; పావకశ్చ-అగ్నిహోత్రుడును;నభాసయతే-

ప్రకాశింపజేయజాలరు; యత్-ఏస్థానమును; గత్వా-పొంది; సనివర్తంతే-తిరుగిరారో; పరమం-ఉత్కృష్టమైన; తత్ - అది; మమ-నాయొక్క; ధామ-స్థానము.

అలాటి అవ్యయ పదమును సూర్యుడుగాని చంద్రుడుగాని అగ్నిహోత్రుడుగాని ప్రకాశింప చేయజాలరు. ఏ పదమును జెందిన వెనుక పునర్జన్మములు లేవో అట్టి పరమోత్కృష్టమైన పదమే నా స్థానమని తెలియుము.

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః।

మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

సనాతనః-అనాదియైన; మమ-నాయొక్క; అంశఏవ- అంశమే; జీవలోకే - సంసారమందు; జీవభూతః- జీవస్వరూపమై సదై; ప్రకృతిస్థాని- మాయయందున్న; మనష్షష్ఠాని; మనస్సె ఆరవదిగాగలిగిన అనగా మనస్సుతోగూడిన; ఇంద్రియాణి-ఇంద్రియములును; కర్షతి-ఆకర్షించుచున్నది.

మరియు అనాదియైన నా యంశమే ప్రపంచమునందు జీవరూపమైయున్నది. ప్రకృతిసంబంధమై మనస్సుతో జేరిన జ్ఞానేంద్రియములు ఆ జీవుని విషయములయందు లాగుచున్నవి.

శరీరంయదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।

గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. 8

ఈశ్వరః - జీవుడు; యచ్ఛరీరం - ఏ శరీరమును; అవాప్నోతి-పొందుచున్నాడో; యచ్చ; ఏ శరీరమును; ఉత్క్రామతి-విడుచుచున్నాడో; తదా-అప్పుడు; వాయుః - వాయువు; ఆశయాత్ - పుష్పాదిస్థానమునుంచిన్ని; గంధానివ-గంధమువలనే; ఏతాని-ఈయింద్రియములను; గృహీత్వా-గ్రహించుకొని; సంయాతి-పోవుచున్నాడు.

జీవుడు శరీరములయందు దూరునపుడును శరీరములను వదలునపుడు గాలి పుష్పవాసనల తీసుకపోవు విధమున ఇంద్రియములనున్ను వానితో గూడిన మనస్సునున్ను తీసుకొని పోవుచున్నాడు.

శ్రోత్రంచక్షుఃస్పర్శనంచ రసనంఘ్రాణమేవచ।
అధిష్ఠాయమనశ్చాయం విషయానుపసేవతే. 9

అయం-ఈజీవుడు; శ్రోత్రం - చక్షుః స్పర్శనం, రసనంఘ్రాణం-ఇంద్రియములను; మనశ్చ-మనస్సును; అధిష్ఠాయ- అధిష్ఠించి; విషయాన్-శబ్దాదులను; ఉపసేవతే-అనుభవించుచున్నాడు.

ఈజీవుడు జ్ఞానేంద్రియములయినత్వక్, చక్షు, శ్రోత్ర, రసనంఘ్రాణేంద్రియములనున్ను మనస్సునున్ను తగిలి ఇంద్రియవిషయములయిన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను అనుభవించుచున్నాడు.

ఉత్క్రామంతం స్థితంవాపి భుంజానంవా గుణాన్వితం।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

విమూఢాః - అవివేకులు; (జీవుని) ఉత్క్రామంతం - దేహమునువిడుచుచున్నవానినిగాను; స్థితమపివా - ఉన్నవానినిగాను; భుంజానంవా - అనుభవింపుచున్న వానినిగాను; గుణాన్వితం-గుణయుక్తునిగాను;నానుపశ్యంతి- ఆలోచించరు;జ్ఞానచక్షుషస్తు-జ్ఞానదృష్టికలవారలైతే,పశ్యంతి-ఆలోచించుచున్నారు.

తెలివిలేని వారు ఈ జీవుని శరీరము వదలిపోవునప్పుడేమి? శరీరమందుండునప్పుడేమి? ఇంద్రియవిషయము లనుభవించునప్పుడేమి? గుణయుక్తుడుగానున్నపుడేమి యెఱుగజాలరు. జ్ఞానదృష్టిగలవారు వీటినంతయు చక్కగా చూచుచున్నారు.

యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మ న్యవస్థితం।
యతంతోప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః. 11

ఆదిత్యగతం-సూర్యగతమైన; యత్తేజః - ఏతేజస్సు; అఖిలం-సమస్తమైన; జగత్ -లోకమును; భాసయతే- ప్రకాశింపజేయుచున్నదో; చంద్రమసి - చంద్రునియందలి; అగ్నౌ - అగ్నియందలి; యత్ -ఏతేజస్సుగలదో; తత్ -ఆ తేజస్సును; మామకం-నాసంబంధమైనదానినిగా; విద్ధి- తెలియుము.

యోగులు తగినయత్నములు జేయువారై దేహములోనం

తర్గతమైన ఆత్మస్వరూప జీవుని చూరుగుచున్నారు. ఆత్మజ్ఞానములేని మూఢులు యత్నములు జేసియు ఆత్మను కనజాలరు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం. 12

యోగినః-యోగులు; యతంతః- యత్నముచేయుచున్నవారలై; ఏనం-ఈయాత్మను; ఆత్మని-తనయందు; అవస్థితం-ఉన్నవానినిగా; పశ్యంతి-చూచుచున్నారు; అకృతాత్మనః-ఆత్మజ్ఞానములేని; అచేతసః - అవివేకులు; యతంతోఽపి-యత్నము చేయుచున్న వారలైనను; ఏనం-ఈఆత్మను; నపశ్యంతి-చూడరు.

సూర్యుడు, చంద్రుడు, అగ్ని వీరలలో ఏ ప్రకాశము అంతర్గతమై ఎల్ల ప్రపంచములను ప్రకాశింప జేయుచున్నవో, అట్టి ప్రకాశము నాతో జేరిన ప్రకాశమని యెఱుగుము.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః. 13

అహం - నేను; గాం-భూమిని; ఆవిశ్య-ప్రవేశించి; ఓజసా-బలముచేత; భూతాని-ప్రాణులను; ధారయామి-ధరించుచున్నాను; రసాత్మకః-రసస్వరూపుడైన; సోమః - చంద్రుడను; భూత్వా-అయి; సర్వాః-సమస్తములైన; ఓషధీః- వ్రీహియవాదులను; పుష్ణామి-పోషించుచున్నాను.

నేను భూమియందుచొచ్చి నా బలముచే జీవకోట్లనన్నిటిని మోసుకొని యున్నాను. నేనే రసస్వరూపుడైన చంద్రుడనై ఎల్ల ఓషధులను కాపాడుచున్నాను.

అహంవైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

అహం-నేను; వైశ్వానరః-జఠరాగ్నిని; భూత్వా- అయి; ప్రాణినాం - దేహధారులయొక్క; దేహం-శరీరమును; ఆశ్రితః-ఆశ్రయించినవాడనై; ప్రాణాపానసమాయుక్తః- ప్రాణాపానవాయువులతో గూడినవాడనై; చతుర్విధం- భక్ష్య భోజ్య చోష్య లేహ్యములని నాలుగువిధములు గలిగిన; అన్నం- అన్నమును; పచామి-పచనము జేయుచున్నాను.

దేహముధరించినవారి దేహములయందు జఠరాగ్ని స్వరూపుడనై ప్రాణాపాన వాయువులతో జేరి వారలు తిను నాల్గువిధములయిన భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పదార్థములను జీర్ణము చేయుచున్నాను.

సర్వస్యచాహం హృదిసన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ।
వేదైశ్చసర్వై రహమేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవచాహమ్. 15

సర్వస్య-సమస్తప్రాణిజాలముయొక్క; హృది - హృదయమందు; అహం-నేను; సన్నివిష్టః-ప్రవేశించియున్నాను కావున; మత్తః-నావలన; స్మృతిః- తెలివియు; జ్ఞానం-జ్ఞానమును; అపోహనం-స్మృతిజ్ఞానాప గమనమును; భవతి-అవుచున్నది; సర్వైః వేదైః-సమస్తవేదములచేత; వేద్యః-తెలియదగినవాడను; వేదాంతకృత్-వేదాంతమునుజేసినవాడను; వేదవిత్-వేదమునుతెలిసినవాడను; అహం-నేను.

అనేక ప్రాణుల మనస్సులయందు నేను దూరుచున్నాను. నాచేతనే వారలకు స్మృతి, జ్ఞానము, మాంద్యము, పుట్టుచున్నవి. అనేక వేదములచే ఎఱుగదగిన వాడను వాటిని చేసినవాడను తెలిసినవాడును నేనేను.

ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థో౾క్షర ఉచ్యతే. 16

లోకే-లోకమందు; క్షరశ్చ-క్షరుడని; అక్షరశ్చ-అక్షరుడని, ద్వౌ ఇమౌ-వీరిద్దరును; పురుషౌ- పురుషులు; (వీరిలోపల) క్షరః-క్షరపురుషుడు; సర్వాణిభూతాని - సమస్త భూతములనియును; అక్షరః-అక్షరపురుషుడు, కూటస్థః-జీవుడనియు; ఉచ్యతే-చెప్పబడుచున్నాడు,

ఎల్లలోకములయందు క్షరుడని అక్షరుడని ఇరువురుగలరు.

అందునక్షరుడు ఎల్లశరీరములే స్వరూపముగాగలవాడు. అక్ష
రుడు కూటస్థుడని పెద్దలు జెప్పుదురు.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

అన్యః-ఈయిద్దరికంటె విలక్షణుడైన; ఉత్తమః- ఉత్కృ
ష్టుడైన; పురుషః - పురుషుడు; పరమాత్మేతి- పరమాత్మయ
ని; ఉదాహృతః-చెప్పబడెను; యః - ఏపరమాత్మ; లోకత్రి
యం-మూడులోకములను; ఆవిశ్య-ప్రవేశించి; బిభర్తి - భ
రించుచున్నాడో; సఏవ-ఆపరమాత్మే; అవ్యయః- నాశరహి
తుడయిన; ఈశ్వరః-శ్రీమన్నారయణుడని చెప్పబడెను.

ఈ ఇద్దరికన్న విలక్షణుడు మరొకడున్నాడు. అతడే పర
మాత్మ అతడే స్వర్గ, మర్త్య, పాతాళ లోకములలో ప్రవే
శించి వానిని భరింపుచున్నాడు. అతడే నాశరహితుడైన
ఈశ్వరుడు.

యస్మాత్క్షర మతీతోహ మక్షరాదపిచోత్తమః।
అతోస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ 18

యస్మాత్ - ఏకారణమువలన; అహం-నేను; క్షరం-క్షర
పురుషుని; అతీతః-అతిక్రమించినవాడనో; అక్షరాదపి - అక్ష
రునికంటే; ఉత్తమః-ఉత్తముడనునయితినో, అతః- ఆకారణ

ముచలన; లోకేచ - లోకమందును; వేదేచ- వేదమందును; ప్రథితః-ప్రసిద్ధుడనైన; పురుషోత్తమః-పురుషోత్తముడను; అస్మి-అవుచున్నాను.

నేను క్షరపురుషుని మీరినవాడనై అక్షరునికన్న ఉత్తముడను గనుక ప్రపంచములయందును వేదములయందును పరమాత్మస్వరూపుడైనపురుషోత్తముడని ప్రసిద్ధిజెందియున్నాను.

యో మామేవమసంమూఢో జానాతి పురుషోత్తమమ్।
సనర్వవిద్భజతి మాం సర్వభావేన భారత. 19

హేభారత- ఓయి అర్జునుడ; యః-ఎవ్వడు; అసమ్మూఢస్సన్-మోహవర్జితుడై; ఏవం-ఈప్రకారముగా; పురుషోత్తమం-పురుషోత్తముడనైన; మాం - నన్ను; జానాతి- తెలియుచున్నాడో; సః-వాడు; సర్వవిత్సన్-సర్వజ్ఞుడైనవాడై; సర్వభావేన-సమస్తవిధములచేత; మాం-నన్ను; భజతి - పొందుచున్నాడు.

ఓ అర్జున! ఎవడైతే మోహమునువిడిచినవాడై పైజెప్పినరీతిగ పురుషోత్తముడైన నన్ను యెఱుగుచున్నాడో అట్టివాడు సర్వజ్ఞుడై ఎల్లవిధములచేత నన్ను జెందుచున్నాడు.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత. 20

అనఘ–పాపరహితుడవైన; హే భారత- ఓయి అర్జునా! గుహ్యతమం- మిక్కిలిరహస్యమైన; ఇదంశాస్త్రం–ఈశాస్త్రము; మయా–నాచేత; ఉక్తం–చెప్పబడెను; ఇతి – ఈప్రకారముగా; ఏతత్ – ఈశాస్త్రమును; బుద్ధ్వా - తెలిసికొని; బుద్ధిమాన్-బుద్ధిగలవాడును; కృతకృత్యశ్చ-కృతకృత్యుడును; స్యాత్ -అవును.

ఓ అర్జున అతిరహస్యమైన ఈ శాస్త్రమును నీకుగాను విస్తరముగ జెప్పితిని. దీనిని నేను వివరించిన విధమున యెఱిగిన బుద్ధిమంతులు జ్ఞానవంతులయి తాము చేయఁదగిన కర్మలను జేయుదురు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
పురుషోత్తమ ప్రాప్తి యోగో నామ
పంచదశో ధ్యాయః.

ఇట్లు ఉపనిషద్ రూపములును, బ్రహ్మ విద్యయును,
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జునసంవాదరూపం
బైన పురుషోత్తమ ప్రాప్తి యోగమనెడి
పంచదశాధ్యాయము ముగిసినది.

## శ్రీ భగవద్గీత

## దైవాసుర సంపద్విభాగ యోగోనామ

## షోడశోఽధ్యాయః.

### శ్రీ భగవానువాచ.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

అభయం-భయము లేక యుండుటయు; సత్త్వసంశుద్ధిః - సత్త్వభావవ్యవహారమును; జ్ఞానయోగవ్యవస్థితిః- జ్ఞానయోగమందుండుటయు; దానం-ఇచ్చుటయు; దమశ్చ- బాహ్యేంద్రియనిగ్రహమును; యజ్ఞశ్చ-యజ్ఞమును, స్వాధ్యాయః- వేదాధ్యయనమును; తపః-తపస్సును; ఆర్జవం - ఋజుత్వమును.

వెఱపు లేక యుండుట మనశ్శుద్ధి జ్ఞాన యోగమునందుండుట దానములు చేయుట బాహ్యేంద్రియ నిగ్రహము యజ్ఞములు వేదాధ్యయనములు జేయుట తపోనిష్టుడు గావుట అధర్మమందు ప్రవేశించక యుండుట.

అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

అహింసా - హింసారాహిత్యము; సత్యం - యథార్థవాక్య

ను; అక్రోధః-క్రోధము లేకయుండుట; త్యాగః- వితరణము; శాంతి-చిత్తోపశమము; అపైశునం - పిశునత్వరాహిత్యము; భూతేషు-సర్వప్రాణులయందు; దయా-కృపయు; అలోలత్వం- విషయసన్నిధిని ఇంద్రియ వికారము లేకయుండుటయు; మార్దవం-మృదుత్వము; హ్రీః-సిగ్గు; అచాపలం - చాపల్యము లేకయుండుట

ఇతర పీడావర్జనము, సత్యము, క్రోధము లేక యుండుట, సర్వసంగపరిత్యాగము, చిత్తోపశమము, ఇతరులయందు దోషములు చెప్పకుండుట, ఎల్ల ప్రాణులయందు కనికరము, విషయములు ప్రాప్తమైనపుడు వికారములు లేకయుండుట, మృదుత్వము, లజ్జ, చాపల్యము లేక యుండుట.

తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవంతిసంపదం దైవీ మభిజాతస్య భారత. 3

హే భారత-ఓయి అర్జున; తేజః-ప్రతిభతో గూడియుండుట; క్షమా-ఓర్పు; ధృతిః-ధైర్యము; శౌచం-బాహ్యాభ్యంతర పారిశుద్ధ్యము; అద్రోహః-పరులకు ద్రోహము చేయకయుండుట; నాతిమానితా - గర్వము లేకయుండుట; (ఇత్యేతాని); ఈ చెప్పబడిన అభయాదులు; దైవీం- దేవతాసంబంధమైన; సంపదం - సంపదను గూర్చి; అభిజాతస్య-పుట్టినవానికి; భవం

తి-కలుగుచున్నవి.

సాహసముతో వుండుట, ఓర్పు, ధైర్యము, శుద్ధి, ఇతరుల నువంచింపకయుండుట, కావరములేకయుండుట మొదలగు ఈ గుణములు దేవాంశమునబుట్టిన వారికి యుండును.

దంభోదర్పోభిమానశ్చ క్రోధఃపారుష్యమేవచ।
అజ్ఞానంచాభిజాతస్య పార్థసంపదమాసురీం. 4

హే పార్థ-ఓయి అర్జున! ఆసురీం- అసురసంబంధమైన; సంపదం - ఐశ్వర్యమునుగూర్చి; అభిజాతస్య- పుట్టినవానికి; దంభః-ధర్మధ్వజిత్వము; దర్పః - గర్వము; అతిమానితా-అభిమానిత్వము; క్రోధః-క్రోధము; పారుష్యం-పరుషత్వము; అజ్ఞానం-అవివేకమును; భవంతి-కలుగుచున్నవి.

ఓ అర్జున! డంబము, గర్వము, అభిమానము, క్రోధము, కఠినపుమాటలు, అవివేకము ఈ గుణములన్నియు రాక్షసాంశమున పుట్టిన వారలకు వుండును.

దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా।
మాశుచస్సంపదందైవీ మభిజాతోసిపాండవ. 5

దైవీ-దేవతాసంబంధమైన; సంపత్-సంపద; విమోక్షాయ-సంసారవిమోచనముకొరకు; మతా-సమ్మతమైనది; ఆసురీ-అసురసంబంధమైన; సంపత్ - సంపద; నిబంధాయ- సం

సారముకొఱకు; మతా:-వమ్మతమైనది; హేపాండవ - ఓయి అర్జున; త్వం-నీవు; దైవీం- దేవతాసంబంధమైన; సంపదం- సంపదనుగూర్చి; అభిజాత -పుట్టినవాడవు; అసి - అయితివి; మాశుచః - దుఃఖించకుము.

ఓ ధనంజయా! దేవాంశమునబుట్టుట మోక్షసాధకముగా నున్నది. రాక్షసాంశమున బుట్టుట ప్రకృతిసంబంధమైన జనన మరణములకు కారణముగా నున్నది. నీవు దేవాంశమున పుట్టినవాడవు గాన నీవు చింతిల్ల అవసరము లేదు.

ద్వౌభూతసర్గౌలోకేస్మిన్ దైవఆసురఏవచ।
దైవోవిస్తరశఃప్రోక్త ఆసురం పార్థమేశృణు. 6

హే పార్థ-ఓయి అర్జున! అస్మిన్‌లోకే - ఈలోకమందు; దైవశ్చ-దేవతాసంబంధమనియు; ఆసురశ్చ - అసురసంబంధమని; భూతసర్గౌ-ప్రాణిసృష్టులు; ద్వౌ-రెండువిధములుగిలవి.(ఆరెంటియందు); దైవః- దేవతా సంబంధమైన భూతసృష్టి; విస్తరశః-విస్తారముగా; ప్రోక్తః-చెప్పబడెను; ఆసురం- అసురసంబంధమైన భూతసృష్టిని; మే-నాయొక్క (వాక్కువలన, శృణు-వినుము.

ఓయి పార్థ! ప్రపంచమున ప్రాణులకు దేవాంశము అసురాంశమని రెండు విధములయిన జన్మములున్నవి. దేవాంశ జ

స్సగుణములను సవిస్తారముగ జెప్పబడెను. అసురాంశ జన్మగుణములను ఇకను సవిస్తారముగ జెప్పెద వినుము.

ప్రవృత్తించ నివృత్తించ జనానవిదురాసురాః।
నశౌచంనాపిచాచారో నసత్యంతేషువిద్యతే. 7

అసురాః - అసురస్వభావముకలిగిన; జనాః-జనులు, ప్రవృత్తిం-ధర్మప్రవృత్తిని; నివృత్తించ-ధర్మనివృత్తిని; నవిదుః- తెలియరు; తేషు-వారియందు; శౌచం-శుచిత్వమును; ఆచారోపి-ఆచారమును; సత్యంచ-యథార్థభావమును, నవిద్యతే-ఉండదు.

రాక్షసాంశమున పుట్టినవారికి శ్రౌతస్మార్తకర్మప్రవృత్తి ఇదియనియు కర్మనివృత్తి ఇదియనియు తెలియదు. వారికి అంతర్బహిశ్శుద్ధి సదాచారము సత్యము ఉండదు.

అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్. 8

తే-ఆయసుర జనులు, జగత్-జగత్తును; అసత్యం-లేనిదిగాను; అప్రతిష్ఠం-ప్రతిష్ఠారహితమైనదానినిగాను, అనీశ్వరం- నియామకుడులేనిదానిగాను, ఆహుః- చెప్పుదురు, (ఇదియునుగాక); అపరస్పరసంభూతం-(స్త్రీపురుషుల) పరస్పర సంబంధమువలనబుట్టినది; అన్యత్కిం - వేరేయేమియున్నది (వారలజగ

త్తును); కామహైతుకం — కామమే హేతువుగాగలిగినది(అది యీలోకమునకని జెప్పెదురు)

రాక్షసాంశజులకు ఎల్ల ప్రపంచమును సత్యరూపముని స్థాపించు వేదములను నమ్మరు. వాటిలో ధర్మాధర్మ ప్రతిష్ఠ లేదని వాదింతురు. లోకములన్నియు స్త్రీపురుషులచే గలిగినదనియు కామహేతువనియు మరేమి కాదనియు చెప్పెదురు.

ఏతాంద్దృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః 9

ఏతాంద్దృష్టిం–ఈజ్ఞానమును; అవష్టభ్య– అవలంబించి; నష్టాత్మానః - నష్టాత్ములై; అల్పబుద్ధయః – స్వల్పబుద్ధిగలవారలై; ఉగ్రకర్మాణః-హింసాదిక్రూరకర్మముగలవారలై; అహితాః–శత్రువులై; జగతః–లోకముయొక్క; క్షయాయ–నాశముకొఱకు; ప్రభవంతి–పుట్టుచున్నారు.

ఇట్లు అభిప్రాయముగలవారై నష్టాత్ములై అల్పబుద్ధిగలవారై హింసాది క్రూరకర్మలుజేయుచు లోకమునకు పగవారై లోకనాశమునకు యత్నించుచుందురు.

కామమాశ్రిత్య దుష్పూరందంభమానమదాన్వితాః।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥10

దుష్పూరం - నిండింపనశక్యమైన; కామం- కోరికను;

శ్రిత్య-ఆశ్రయించి; మోహాత్-అజ్ఞానమువలన; అసద్గ్రాహాన్-అన్యాయపుపరిగ్రహములను; గృహీత్వా-గ్రహించి; అశుచివ్రతాః-అశాస్త్రనియమముగలవారలై; దంభమానమదాన్వితాః-దంభమానమదములతో గూడినవారలై; ప్రవర్తంతే-ప్రవర్తించుచున్నారు.

అట్టివారు మెండుకోరికలతో దంబ, మాన,మదములతో చేరినవారై నిక్షేపాదులను యిచ్ఛించుచు క్షుద్రదేవతలనుగొలుచువారై అశాస్త్రనియమములో వర్తించుచుందురు.

చింతామ పరిమేయాంచ ప్రళయాంతాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితినిశ్చితాః. 11

ప్రళయాంతాం-మరణమే తుదగాగలిగిన; అపరిమేయాం-అపరిమితమైన; చింతాం-చింతను; ఉపాశ్రితాః-ఆశ్రయించినవారలై; కామోపభోగపరమాః - కోరికల అనుభవించుటయే యుత్కృష్టముగా గలవారలై; ఏతావదితి-ఇంతేయని; నిశ్చితాః-నిశ్చయించినవారలై.

మరిన్ని చావువరకు హెచ్చుచింతతో కామభోగములే పరమార్థములని నిశ్చయముగానమ్మి ప్రవర్తించుచుందురు.

ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః।
ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్ 12